# గవర్నరుకును మంత్రులకును బాధ్యత విభాగము మంత్రుల బాధ్యత సున్న జేయుటయే

## మంత్రులకు బాధ్యత వదలనిచో కాంగ్రెసు పదవులలో నుండజాలరు

భారత రాజ్యాంగశాసనము వైస్రాయిగారు దుర్వినియోగము చేసిరి

## వైస్రాయిగారి ప్రకటనను గూర్చి గాంధిమహాత్ముని అభిప్రాయము

## సంధికి అవకాశము వదలబడి నందుకు సంతోషము

వర్ధా ఫిబ్రవరి ౨౩

గాంధి మహాత్ముడు వైస్రాయిగారి స్టేట్మెంటును ఈ సాయంత్రము ౭ గంటలకు చదివి, పత్రికలలో ప్రకటనకై ఈ క్రింది ప్రత్యుత్తరమును చెప్పెను.

"నేను గవర్నరు జనరలుగారి స్టేట్మెంటును దానికి తగిన సద్భావముతోను శ్రద్ధతోను చదివితిని. వారు, రాష్ట్రములలో శాసనసభలయందు కాంగ్రెసు సభ్యులు మంత్ర్యధికారములను అంగీకరించుటకు ముందు ఒకమాట నీయవలెనని కోరినపుడు, చేసియుండిన ప్రకటనముచే అధమపక్షము నాకైనను, నేను చెప్పదగునేని, అనేక కాంగ్రెసుసభ్యులకును కొంత సంతోషము కలిగియుండెను. అట్లే ఈసారి కలుగునని ఆశించియుంటిని. ఇపుడీప్రకటన చూడగా ఎన్నడును కంపినిఎఱుంగని అధికారముగల ఒక గొప్పవానికి అనర్హమైన ప్రత్యేకవాదముగ నది కనబడుచున్నది.

వదలిపెట్టవలసిన ఖైదీల కేసులను పరీక్షించుట అనవసరమని ఎవరును అనియుండలేదు. కాని నేనూహించినదంతయు, కాంగ్రెసు మిక్కుటమైన పట్టుదలతో ఆక్షేపించునదంతయు సంపూర్ణ రాష్ట్రీయ స్వాతంత్ర్యము ననుభవించు రాష్ట్రములలో రాష్ట్రీయుల గవర్నరులు అట్టి పరీక్ష చేయుట అనవసరమనియే. అదియు, అపరిమితమగు వాక్కు అనిర్దిష్టముగా మంత్రులకొసగిన భారత రాజ్యాంగ శాసనమును బట్టియు, ప్రజలకు బాధ్యులగు ప్రభుత్వములు కలకాలము నీతిలో ఆచరణములను బట్టియు నా అభిప్రాయము.

"సామాన్య విధానమును గూర్చిన సంశయములలో మంత్రులకు సలహానొసగుటయు, కొన్ని అధికారములను ఉపయోగించుటచే కలుగగల ఉపద్రవమునుగూర్చి హెచ్చరిక చేయుట గవర్నరు యొక్క విధియు హక్కును అయియున్నది. అట్లు చేసినతర్వాత వారలు మంత్రులను, ఎట్టినిర్బంధము లేకుండ, తమకు మంచిదని తోచుదాని నాచరించనీయవలెను. అట్లుకానిచో, బాధ్యతయునదినిరర్థకపదమగును. శాసనముచే మంత్రులకు వశము చేయబడిన దైనందిన పరిపాలనా సౌకర్యములందు వారల బాధ్యతను గవర్నరుకూడ పంచుకొనినచో, తమను ఎన్నుకొనినవారలకు బాధ్యులైన మంత్రులు పంచుకొనదగిన భాగముగ అప్రతిష్ఠయు, అవమానమును మాత్రమే మిగులును.

"విడివిడిగ వివరములను విచారించకుండ గవర్నర్లను అపుటకు తమకు నిష్పంకయముగాగల అధికారములను ఉపయోగించలేదని అసహాయులైన మంత్రులనుగూర్చి చెప్పుట గవర్నరుజనరలుకు ఎంతమాత్రము సాటిగాదు. కాంగ్రెసు తీర్మానము వారల సహాయమునకు చేర్పుకొనదగిన ఓర్పు అని వర్ణించియున్నది. బహుళమంత్రులు తమపనికి క్రొత్తవారలగుటచే వారి అనుభవరాహిత్యముకూడ ఇందుకు కారణమై యుండునని నేను చెప్ప సాహసించుచున్నాను. కాబట్టి ఈముఖ్యప్రశ్న మంత్రులపక్షమున నిర్ణయింపబడనిచో, కాంగ్రెసు అనుమతించిన ఆగొప్ప బాధ్యతను మంత్రులు వహించుట కష్టమగును.

బెంగాలులో నేవలంబించిన విధానమునకై ప్రజయవృష్టిని గవర్నరు జనరలుగారు అతిక్రించినందుకు నేను సంతోషించుచున్నాను. నాయ ఒకవైపు బెంగాలునకు ఇంకొకవైపు బీహారు, ప్రయాగ రాష్ట్రములకును గల భేదము గమనించి యుండవచ్చును. బెంగాలులో నేను ఏ స్వరూపములోగాని కాంగ్రెసువాగ్దానముచే బంధింపబడని ప్రభుత్వముతో వ్యవహరించు నవకుపుచుంటిని. అక్కడ మంత్రులు, అది మంచిదనుకొనడు కొరదనుకొనుడు అమాటకేసి, ఒక్కొక్కడిగ శిక్ష ననుభవించుచున్న ఖైదీల విడుదలకు ప్రయత్నించునట్లు లేకుండిరి. ఖైదీలకు నేనొసగిన వాగ్దానమునొప్పుటకై నేను చాల చిన్న ప్రయత్నము చేయుచుంటిని. నాఉద్దేశ్యమంతయు మానవకారుణ్యమాత్రమే. అందుకు నా చేతనున్న ఆయుధము బెంగాలు మంత్రులమానవహృదయములకు విన్నపమే. నేనువారిగుండెలతో మొఱపెట్టుకొనుచుండవలెనని ఇపుడు సంతోషముతో చెప్పగలుగుచున్నాను.

బీహారు ప్రయాగ రాష్ట్రములలోస్థితి ఇందుకు సంపూర్ణవిరుద్ధముగ నున్నది. అక్కడి మంత్రులు వారలకు ఎన్నికలలో జయమొసగిన వాగ్దానపత్రమునకు బద్ధులైయున్నారు, వారలు విడుదలచేయ ప్రయత్నించుచుండిన ఖైదీలకేసులను వారలు పరీక్షించుటయేగాక, తమరాష్ట్రములో శాంతిని సంరక్షించవలసిన బాధ్యత తమయందున్నదని ఎఱిగినవారలగుటచే, వదలదలచిన ఖైదీలనుండి తమకు హింసయందు ఇక ఎంతమాత్రము విశ్వాసము లేదను మాటగూడ పొందియుండిరి.

"గవర్నరు జనరలుగారి ప్రకటనలో ఒక్క విషయము మాత్రము నాకు రానున్న విషమ స్థితిని తప్పించవచ్చునను ఆశకు అవకాశమిచ్చుచున్నది. గవర్నర్లకును మంత్రులకును సమాధానపురాయబారములకు వారికను అవకాశము వదలినారు. మంత్రులిచ్చిన సందేశములు ఆకస్మికములని నేనంగీకరించుచున్నాను. అవి అట్లుండకతప్పినదికాదు. పరిస్థితులను విమర్శించుటకు ఇప్పటికిని అందరికిని చాలినంత వ్యవధి లభించియున్నది. విడిసందర్భముల పరీక్ష మంత్రుల అధికారములను ఆక్రమించుకొనుట కుద్దేశింపబడ లేదనియు, మంత్రులు ఖైదీలనుండి వాగ్దానములను పొంది యున్నందుచే తమ బాధ్యతపై వారలను వదలుటకు స్వతంత్రులని ను విశ్వాసము కలిగించుటకు గవర్నర్లు స్వతంత్రులుగ వదలబడినచో, విషమస్థితి తప్పునని నా యభిప్రాయము. అప్పుడు మంత్రులు గవర్నరులచే పిలిపించబడినచో, వారు తమకీయబడు వాగ్దానములు తమకు సంతృప్తికరములా కావా యనునది తామే నిర్ణయించుకొనుటకు కార్యకారిణీసంఘమువారు స్వాతంత్ర్య మీయవలెను.

"గవర్నరు జనరలుగారు సబ్‌సెక్షను ౯౦. ౧౨౬ను ఉపయోగించుటను సమర్థించుకొనుటకు చెప్పి కారణమును దృష్టిలో నుంచుకొని సెక్షను ౧౨౬ (౫) ను ప్రయోగించిన సందర్భమునకే శోకవిషయము చెప్పవలసియున్నది. నేను దానినంతయు చదివినాను. కొన్ని సందర్భములలో రాష్ట్రముపై ఫెడరేషనును హద్దులో నుంచుటకు దానిప్రకారము హక్కుగలదు. సబ్‌సెక్షనులకు ఒకదానితో నొకదానికి సంబంధము లేకపోయినచేతప్ప వాటిని ఒక్కొక్కటిగ చదువవలసియున్నదే తప్ప, సెక్షను ౧౨౬ సబ్‌సెక్షను ౫క్రింద అధికారముల నుపయోగించుట తప్పక మర్యనియోగమని అర్థము. కాని ఇది నావ ప్రమాదకరమైనవిషయము. న్యాయవేత్తలు దానిని నిర్ణయింతురుగాక! ఈ దీర్ఘప్రకటన చేయుటలో నాయుద్దేశ్యము ఆకస్మికముగ ఉదయించిన చిక్కును విడదీయుటయే."

## పంజాబులోనికి ప్రొఫెసర్ రంగాగారి నిషేధము

అడ్జర్న్‌మెంటు ప్రతిపాదన ఓడుట

లాహోరు ఫిబ్రవరి ౨౪

ప్రొఫెసరు రంగాగారిని వారి మిత్రులబారినుండి తప్పించినందుకు నాయ మా ప్రభుత్వమునకు కృతజ్ఞత దెలుపవలెనియున్నదని, పంజాబు అసెంబ్లీలో అడ్జర్న్‌మెంటు ప్రతిపాదనను ఎదిరించుచు ప్రధాని తెలిపెను. ఏ దారివరకు పంజాబులోనికి రాగూడదని ప్రభుత్వమువారు కేంద్రశాసనసభ్యులగు ప్రొఫెసర్ ఎన్. జీ. రంగాగారిని నిషేధించుటను నిరసించుటకై మారిసింగుగారు సభా కార్యక్రమమును ఆపవలెనని ప్రతిపాదించిరి.

ప్రధాని జవాబు

సర్ సికిందరు హయతుఖానుగారు, వీటచే ప్రత్యుత్తరమొసంగుచు తమకు తెలిసిన సమాచారము సభలో తెలిపిన ప్రమాదమగునని యు, ఒకానొకసంస్థ సమిష్టి దౌర్జన్యచర్యకు ప్రోత్సాహ మొసంగదలచి, అందులో ప్రొఫెసరు రంగాగారి నియుక్తిదలచినదని తాను బాగుగ నెఱుంగుదుననియు జెప్పిరి. ప్రొఫెసరు రంగాగారు బాధ్యతగల ప్రజాహిత జీవులనియు, ఇటీవల వారు పంజాబులో ఒసంగిన ఉపన్యాసములు ఒకదృష్టిలో ఆక్షేపణీయములేఅయినను, వారిని పంజాబులోనికి రాకుండ నిషేధింపదగినంత తీవ్రముగను ప్రమాదముగను లేవని తాను స్వయముగ నెఱుగుదుననియు జెలిపిరి.

పొరుగురాష్ట్రములలో రాజకీయములందు యితరులువచ్చి జోక్యము కలిగించుకొనరాదను ఆచారము, ఒకసారి తప్పించినయెడల, ఇండియాలో అరాజకము తప్పక రాగలదని తాను నమ్ముచున్నారనిరి.

ప్రతిపాదన ౪౧—౭౭ వోట్లలో ఓడిపోయినది.

— రాజేశ్వర్ టాకీస్ —
మార్కెటు స్ట్రీటు, శికింద్రాబాదు
సాయంత్రం 6—45 రాత్రి 10 గంటలకు
శనివారం 26 ఫిబ్రవరి 1938 రోజు ప్రారంభం
మహాలక్ష్మీ స్టూడియో లిమిటెడ్‌వారి తెలుగు టాకీ
— బాలయోగిని —
సరోజ
ఈ ఫిల్ముకు ప్రాణము
నాట్యరంగమునకు నవ్యాభరణము
ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డ
కల్లకపటమెరుగని కన్నెపడుచు
ఈమెయే?
అభినయ ప్రవీణ బేబీసరోజిని
ఆమెపాట వరాలమూట
ఆమె పలుకులు చిలుకపలుకులు
ఆమె నవ్వితే నవరత్నాలురాలుతవి
కమలకుమారి — సరస — వంగ వేంకట్రామయ్య — మహాలింగశాస్త్రి
ఇంతేకాదు. ప్రభాకర్ బి. ఏ. ఆరణి సత్యనారాయణ, అప్పలస్వామి, నాగరాజకుమారికూడా నటించారు.

చార్‌మినార్ సిగరెట్లు
చార్‌మినార్ సిగరెట్లలో ఉపయోగింపబడు పొగాకు నిపుణులచే పరుకొనబడినది. యిందువలన చార్‌మినార్ సిగరెట్లు మంచిరకము. ప్రసిద్ధమైన పొగాకుమాత్రమే ఉపయోగింపబడును.
అనేక ఉత్పత్తిస్థానములనుండి యీమాదిరి పీపాలలో పొగాకు చార్‌మినార్ సిగరెట్ ఫ్యాక్టరీకి తేబడును.
చార్‌మినార్ సిగరెట్లు రుచిలో సమానము.
ఏలననదానిలో ఉండునది
చాలమంచి పొగాకు
వజీర్ సుల్తాన్ అందు నన్ను
SABA & Co'

# గోలకొండపత్రిక

ఈశ్వర నామ సం॥ర మాఘ బ॥ ౧౮

సోమవారము


# విద్యాశాఖాధ్యక్షోపన్యాసము

మొనటి అఖిల హైదరాబాదీయోపాధ్యాయ మహాసభకు అధ్యక్షతవహించి విద్యాశాఖాధ్యక్షులగు సయ్యద్ మహమ్మద్ హుసేన్ జాఫరిగారు, తమ ఉపన్యాసములో, ఎట్టి సంకోచమును మనస్సులోనుంచుకొనక, ఈ రాష్ట్ర విద్యాసమస్య విషయములో తమ అభిప్రాయములను వెలిబుచ్చినారు మరియు ఒక్కొక్క విషయమునందును విద్యాశాఖవారు ఏమిచేయ దలచినది, లేక నిశ్చయించినదియు, ఈఉపన్యాసమందు అనేక సందర్భములయందు తెలిపియుండుటచే ఈఉపన్యాసముయొక్క ప్రాముఖ్యము హెచ్చుచున్నది.

గత సంచికయందు మేము ౧౩౪౪, ౧౩౪౫ ఫ. ల విద్యాశాఖ నివేదికను గూర్చిన విమర్శలో ప్రభుత్వము వారుగావించిన ఆజ్ఞపై విమర్శించియుంటిమి.

ఆ యాజ్ఞచేయబడి కొంతకాలము గడచియుండుటచే, ఆయాజ్ఞలోని కొన్ని అంశముల అమలుజరిగినది, లేనిది తెలిసికొనుటకు ప్రజలు కుతూహలులైయుందురనిసూచించియుంటిమి. మేము కోరియుండిన ఆసమాధానము లిపుడు ఈ విద్యాశాఖాధ్యక్షుల వారి ఉపన్యాసములో తెలియుచున్నందుకు సంతోషించుచున్నాము. ఢిల్లీలో చెవిటి, మూగబాలురబడికి ఇద్దరును, కలకత్తాలో గ్రుడ్డిబాలురబడికి ఇద్దరును, గ్రాడ్యుయేటులు పనినేర్చుకొనివచ్చుటకై పంపబడిరి. వారు తిరిగిరాగానే హైదరాబాదునందు చెవిటివారికిని, మూగవారికిని ఒకబడియు, గ్రుడ్డివారికి ఒకబడియు స్థాపించబడునని చెప్పబడినది. ఇవి సంతోషకరమైన అంశములు.

విద్యాశాఖాధికారిగారికి వర్ధా విద్యా విధానము ఎంతమాత్రమును సమ్మతముగలేదు. కారణమేమన దానిచే వృత్తియందు అభినివేశము ఎక్కువయై సామాన్య విద్యయందు అభిరుచి చాల నశించునని వారిభయము. కాని వర్ధా సమావేశముయొక్క తీర్మానమునందు వృత్తి, దానికి సంబంధించిన పనులును సామాన్యవిద్య నేర్చుకొనుటకు సాధనములుగ చేయబడుట వల్ల ప్రధానదృష్టి సామాన్యవిద్యపైననే నుండగలదు. ప్రాథమికదశలో అనుభవముద్వారా శాస్త్ర విషయములను నేర్చుకొనుటయే సరియైన పద్ధతియని అంగీకరించబడిన అంశముగుటచే, వర్ధా విధానమందు అశాస్త్రీయ పద్ధతియను దోషము ఉండజాలదు. బాలురపై సంపాదనభారము వేయుట తప్పు అను ఆక్షేపణ యొకటి చేయబడినది. కాని, మొదట గాంధిమహాత్ముని సూచనకీ యాక్షేపణ చెల్లవచ్చునుగాని, వర్ధా తీర్మానమునకు, అది అస్వరూపములో నున్నంతవరకు, ఈ యాక్షేపణ చెల్లదు. విద్యార్థులు తాము విద్య నేర్చుకొనుటలో చేసిన పనిచే ఉపాధ్యాయుని కీయవలసిన జీతము ను సంపూర్ణముగ నీయగలరను దృఢవిశ్వాసముతీర్మానములో వెల్లడించ బడలేదు; అటుల లభించవచ్చునను ఆశమాత్రమే తెలుపబడినది.

ఖాన్గీపాఠశాలల విషయములో అధ్యక్షులవారు ఖాన్గీపాఠశాలలగస్తీని సమర్థించునపుడు చెప్పిన మాటలు ఆశ్చర్యకరములుగ నున్నవి. ఖాన్గీపాఠశాలల గస్తీని నిర్మించుటలో ఖాన్గీపాఠశాలలను నిరుత్సాహపరచుట ప్రభుత్వమువారిఉద్దేశ్యములని మామెరిగినంతలో ఎవరును అనియుండలేదు. ప్రభుత్వ వారి సదుద్దేశ్యమును శంకించుటకు పూనుకొనక, ఆగస్తీవలన చెడుఫలితములు కలుగుచున్నవనియే ప్రజలమొఱయైయున్నది. కాని అధ్యక్షులవారు ప్రజలలో ఎవరో దురుద్దేశ్యమునారోపించినట్లుగా శంకించి ఖండనచేసిరి. ఆగస్తీకి ఖాన్గీ పాఠశాలలనిరుత్సాహపరచు ఫలితముకూడ లేదని చెప్పునపుడు అధ్యక్షులవారు వాస్తవపరిస్థితులను తృణీకరించుచున్నారు. ౧౩౩౩ ఫ. లో గస్తీకి పూర్వము బళ్ళ సంఖ్య ౮౦౫౩, విద్యార్థులసంఖ్య ౭౬,౬౪౮ ఉండెను. గస్తీ ప్రయోగమునకు ౯ యేండ్ల అనంతరము ౧౩౪౩ ఫలో బళ్ళ సంఖ్య ౧,౬౬౧, విద్యార్థుల సంఖ్య ౨౯,౬౬౨ మాత్రమే యుండెను. ౧౩౪౩ఫ. అంకెలు ౧౩౪౪ఫ. అంకెలపై ఎక్కువగనే నుండవచ్చును. కాని, గస్తీప్రయోగమునకు పూర్వపు అంకెలపై రెండింతలు మూడింతలు హీనముగ నున్నవనుట గస్తీ అమలులో సంభవించిన ఫలితముగాదా! కానిచో ఖాన్గీపాఠశాలల సంఖ్య అంతహీనముగ తగ్గుటకు ఇతరకారణములను విద్యాశాఖాధికారిగారు సూచించినగాని, వారి వాదము నిలవదు. అదిఎట్లైనను, ఇపుడు విద్యాశాఖాధికారిగారు ఆగస్తీ ఖాన్గీబళ్లను ప్రభుత్వపు లెక్కలలో చేర్పించవలెనని మాత్రమే కోరుచున్నదనియు, అంతకుమించి ఇతర నిర్బంధములు పెట్టబడుచున్న సందర్భములలో తమకు తెలిపి న్యాయము పొందవచ్చుననియు చెప్పినందుకు సంతోషించెదము. కేవలము లెక్కలలో చేర్పించుటకు మాకెట్టి ఆక్షేపణగానిలేదు. ప్రజలు విద్యాశాఖాధికారిచ్చిన అవకాశమును సంపూర్ణముగ వినియోగించుకొందురని నమ్ముచున్నాము. ఈ సందర్భమున, సెకండరీ విద్యా శాఖ వారు విద్యాసక్త ప్రజల ప్రయత్నములకు వదలివేసి, తాము కేవలము ప్రోత్సహించదగినవాటికి ద్రవ్యసహాయము చేయుటకు అభిలషించుచున్నారని తెలిసికొనుటకు సంతోషించుచున్నాము. ఈవిధముగ విద్యాశాఖవారికి తొలగు భారము ప్రాథమిక విద్యాభివృద్ధికి తోడ్పడగలదని నమ్ముచున్నాము.

ప్రాథమిక విద్యతో చదువుచాలించుకొనువారలకై, ఆ విద్యాదశకాలమును హెచ్చించుటకును విద్యాశాఖాధ్యక్షులవారు అభిలషించుచుండుట సంతోషకరమైన విషయము. అట్టివారికి నాలుగేండ్లవిద్య చాలదనుట నిజము. చాలించుకొనువారు విద్యాకాలమును ప్రాథమికవిద్య, సెకండరీవిద్య అను నిట్టివిభాగముల లెక్కలలో లెక్కించెదరా అనునది అనుమానము. సాధారణముగా వారలకు ఏవటికాయేడే వేర్వేరుగనుందురని మే మనుకొనెదము. కాబట్టిప్రాథమిక విద్యాదశలో చేరినవారలు మధ్యలో చదువు చాలించుకొనుటకు ప్రయత్నించకుండునట్లు ప్రోత్సాహకరములైన ఏర్పాటు చేసినగాని, విద్యాదశకాలమును హెచ్చించినందుకు ఫలితముండదు.

అధ్యక్షులవారు శారీరిక విద్యలో శరీరమునకు పుష్టికరమైన ఆహారమునుగూడ ఒక అంశముగ చేర్చియుండుట మంచివివేకమైనపని. ఇప్పుడు శారీరిక విద్యాభివృద్ధికై ఒకసంఘము ఏర్పాటుచేయబడి రాష్ట్రమంతటను ఒక మంచి విధానమును నిర్ణయించుటకై ఆలోచనలు సలుపుచుండుట సంతోషకరము. అనేకపాఠశాలలవైద్యపరీక్షచే నూటికి డెబ్బదిమందికంటె ఎక్కువమంది పుష్టికరమైన ఆహారములేక చిక్కియున్నారని తెలియుచున్నట్లు అధ్యక్షులవారు చెప్పిరి. దీనికి గ్రామప్రాంతములలో దారిద్ర్యమే హేతువుఅని కూడ గ్రహించినందుకు సంతోషము. ఈలోపమును దీర్చుటకు విద్యాశాఖవారు వైద్యశాఖవారితో ఆలోచించి కొన్ని బళ్లలో బాలురకు పాలిచ్చు ఏర్పాట్లు చేయుటకై సూచనచేసిరట. ఇదియెంతవరకు నెరవేరునో చెప్పజాలము. నెరవేరినను, కొన్నిబళ్లతోనే ఆగక అన్నిబళ్లకును వ్యాపించినపుడు గదా సంతోషము. తుదకు మొన్న మొన్ననే విమర్శించియుండిన నైజాంకాలేజి నివేదికలో చెప్పబడినట్లు దారిద్ర్యనివారణకై చేయవలసిన విధానములవలంబించబడి, ఫలించినపుడుగాని ఈ శరీరపుష్టిసమస్య పరిష్కారమగుట దుష్కరము.

నిరుద్యోగ సమస్యపై అధ్యక్షులిచ్చిన అభిప్రాయము అక్షరాక్షరము సత్యము. ఇప్పుడీ రాష్ట్రములో ప్రతిఏట ప్రభుత్వోద్యోగుల అవసరములకు చాలినసంఖ్యమందికంటె ఎక్కువమంది విద్యావంతులు బళ్లనుండి వెడలుటలేదనియే వారి అభిప్రాయము. మెకంజీగారును, రైట్ ఆనరబుల్ సర్ ఆక్బర్ హైదరీగారును ఇదివరకు తమ ఉపన్యాసములలో దీనికి విరుద్ధమైన భయమును సూచించియుండిరి. కాని ఇపుడు విద్యాశాఖాధికారిగారు అనునదియేమన, ఒకవేళ అట్టి భయమున్నదనుకొనినను, ఇపుడు చెప్పెడివిద్య గాక క్రొత్తరకపు విద్య నేర్పుట కేర్పాటులు చేసినమాత్రాననే నిరుద్యోగసమస్య పరిష్కారము కాజాలదు. క్రొత్తగా వెడలు విద్యావంతులకు పనిపెట్టు పరిశ్రమలు రాష్ట్రమునందు వృద్ధిచెందవలెననిరి. మే మిదివర కెన్నియోసారులీయంశమును సూచించియుంటిమి.

మొత్తముపై విద్యాసమస్య నిజముగా పరిష్కారము కావలెననిన, ఒక విద్యాబోధన ఏర్పాటులేగాక, వాణిజ్య పరిశ్రమల పోషణము, దేశమందు సంపద అభివృద్ధి, దేశములోని సంపద అందరికిని సమానముగ విభక్తమగునట్లుచూచుట — ఈ ఆర్థిక సమస్యలను పరిష్కరించవలసిన అవసరము అత్యధికముగ కనబడుచున్నది. అవి సరిగా పరిష్కరించబడనంత కాలము విద్యాసమస్యయు, సరిగా పరిష్కారము కాకపోవచ్చును.

## శ్రీ శివశంకర శాస్త్రి గారికి రూ ౧౧౬ లు

హైదరాబాదు ఆంధ్రజనసంఘమువారి సన్మానము

హైదరాబాదు (దక్కన్) ఫిబ్రవరి ౧౩

మనది ఆంధ్రభాషయైనను, ఇతర భాషలమనము వదలరాదు అని శ్రీయుత బొల్లావఝుల శివశంకరశాస్త్రిగారికి హైదరాబాదు ఆంధ్రజనసంఘమువారు రు ౧౧౬లిచ్చి సత్కరించి సభకధ్యక్షతవహించి ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీయుత నరసింగరావుగారు నుడివిరి.

సన్మానసభ రాజా ప్రతాపగిర్జీ గారి భవనములో జరిగెను.

సుమారు మూడు నాలుగు వందల జనులు వచ్చియుండిరి. “శ్రీయుత కపిల కాశీపతి గారు వినతిపత్రమును చదివి సమర్పించిరి. శివశంకర శాస్త్రిగారు తగువిధము సమాధానమిచ్చుచు తమనుగూర్చి చేసిన ప్రశంసలలో చెప్పిన గుణములను అలవరచుకొనుటకు ప్రయత్నించెదమని సర్వ పరిషత్కార్యములవలె నుడివిరి. “పద్మావతీ చరణ చారణ చక్రవర్తి” అను శివశంకర శాస్త్రిగారిచే రచితమైన నాటకము ప్రదర్శించబడెను.

## నిజాం ఆయుర్వేద విద్యార్థి సభ

హైదరాబాద్ (దక్కన్) ఫిబ్రవరి ౧౩

నిజాం ఆయుర్వేదవిద్యార్థిసభవారు నిజాం ఆయుర్వేద సదర్ దవాఖానాలో గతమంగళవారము ప్రత్యేకముగ సమావేశమైరి. బేగం బజారులో ఆదివారము సాయంకాలము హకీం నారాయణదాసు గారి అధ్యక్షతన జరిగిన సభలో ఆయుర్వేద మూలసూత్రములకు విరుద్ధముగ చెప్పినమాటలయెడ అసంతృప్తి ప్రకటించబడినది.

## నిజాంరాష్ట్ర మద్యపాన నిరోధదినోత్సవము

బళ్లకు, ప్రభుత్వ కార్యాలయములకును మధ్యాహ్నము సెలవు

హైదరాబాదు (దక్కన్) ౧౪ ఫిబ్రవరి

హైదరాబాదు (దక్కన్) కేంద్ర మద్యపాన నిరోధసంఘముయొక్క అధ్యక్షులవారి సూచనపై ౨ మార్చి ౧౯౩౮ నాడు మద్యపాన నిరోధ దినము జరుపబడును. కాబట్టి ఆ రోజు నిజాంరాష్ట్రమందంతటను బళ్లును, ప్రభుత్వ కార్యాలయములును ఉదయము ౯ గంటలనుండి మధ్యాహ్నము ౧ గంటవరకుమాత్రమే పనిచేయును.

## మాలుశాఖపరీక్ష

హైదరాబాదు (దక్కన్) ఫిబ్ర. ౧౫

మాలుశాఖ పరీక్ష ఇదివరకు ౨౪ ఏప్రిలు ౧౯౩౮ నుండి ప్రారంభమగునట్లు నిర్ణయించబడియుండెను. ౩౦ ఏప్రిలునాడు వరంగల్లుకు ప్రత్యేకమైన సెలవుదినమగుటచే, ఆపరీక్ష ౨ మే ౧౯౩౮ సోమవారమునుండి ప్రారంభమగునని ఇప్పుడు తెలుపబడుచున్నది.

## వేరు సెనగపై సుంకము

హైదరాబాదు (దక్కన్) ఫిబ్రవరి ౧౫

ప్రభుత్వ ప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు:—

సుంకపుశాఖవారు సూచించుటచే, మ.ఘ.వ నిజాం ప్రభుత్వమువారు ౨౧ ఫిబ్రవరి ౧౯౩౮ తారీఖుగల నెం. ౧౬ ఆజ్ఞచే పొట్టుతీయబడిన వేరుసెనగ కాయలపైనను, గింజలపైనను గూడ ఇదివరకు వరుసగా పల్లా ౧కి ౧-౨ అణాలు, ౧ రూపాయ లెక్కన ఉండు సుంకమును పల్లా ౧కి ౮ అణాలు ౧-౨ అణాలు ఉండునట్లు తగ్గించినారు ఇది ౧౯౩౮ మార్చి ౫వ తేదినుండి అమలులోనికివచ్చును. వేరుసెనగ ధరపడుటచే రైతులు నష్టము పాలుగాకుండుటకై ఇట్లు చేయబడినది.

## మోటారుకారు నిబంధనలు

హైదరాబాదు (దక్కన్) ఫిబ్రవరి ౧౩

తహసీల్దారుగాని మదద్గారు తాలూకాదారుగాని పనిచేయు కార్యాలయమందు లేనపుడు మోటారులకు తాత్కాలికముగ లైసెన్సులిచ్చుటలో అసౌకర్యము కలుగుచుండెడిది అదితొలగించుటకై ఇపుడు మోటారుకారుల నిబంధనలలోదఫా ౫౭లో ౩వ విషయము సవరణచేయబడినది. ఇపుడు లైసెన్సు ఇచ్చుచోటు జిల్లాప్రధానస్థలము గాకతహసీల్దారుగానిడివిజనలుఆఫీసరుగానివసించునదిగ ఉండుచోటుఅయినచో, డివిజనల్ ఆఫీసరు తాత్కాలికముగ లైసెన్సు నొసగవచ్చును. కాని తహసీల్దారు లైసెన్సునీయ నిరాకరించుచో డివిజనలు ఆఫీసరు ఇయ్యజాలడు.

## అంతర్జాతీయ చారిత్రిక శాస్త్ర మహాసభ

ఇది రాబోవు సెప్టంబరులో జూరిచ్ నందు జరుగనున్నది. దానికి ఉస్మానియా విద్యాపీఠపు ప్రొఫెసరగు సరూర్ ఖాజా సర్వాని గారు ఆహ్వానించబడినారు.

## ఉస్మానియా పట్టప్రదానోత్సవము

హైదరాబాదు (దక్కన్) ఫిబ్రవరి ౧౫

ఉస్మానియా పట్టప్రదానోత్సవము ఇక్కడ బాగెఆమ్మాలో ౧ మార్చినాడు సాయంకాలము ౪½ గంటలకు జరుగును. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఉపాధ్యక్షులగు కట్టమంచి రామలింగారెడ్డి గారు స్నాతకోపదేశము గావించెదరు.

## సంయుక్త ప్రయాగరాష్ట్రపు ఖైదీలవిడుదల

కాంగ్రెసు మంత్రివర్గము రాజీనామాల ఉపసంహారానంతరము మొదటిచర్య

లక్నో: ఫిబ్రవరి ౨౨

కాంగ్రెసు మంత్రివర్గము రాజీనామాలనుపసంహరించుకొని మరల అధికారములోచేరిన తర్వాత ఇపుడు ౫ మంది ఖైదీలను వదలియుండి ఇచటికి విడుదలకై తేబడినారు. గవర్నరు వద్దనుండి సమ్మతి వచ్చిన తరువాత విడుదల జరుపుటకిది మొదటిచర్య.

# నిజాంరాష్ట్రములో మతపరివర్తన ప్రచారము

## ప్రభుత్వమునకు ఆందోళన కలిగించుచున్నది

౧౯౩౩—౧౯౩౭ పరిపాలన నివేదికలో వచనములు

## కాగిదపు పరిశ్రమ స్థాపనకై ఆలోచనలు

౧౯౩౩ నుండి ౧౯౩౭ వరకు నిజాంరాష్ట్రముయొక్క అభివృద్ధిలో విశేషములను తెల్పునట్టి ౧౯ పేజీలపైబడినట్టి పుస్తకపు కాగితములుగల నివేదికయొకటి ప్రభుత్వ ప్రకటన శాఖనుండి మాకు పంపబడినది

ఈనివేదికలో ప్రభుత్వమువారు కాగితము తయారుచేయుటకై ఒక పరిశ్రమను స్థాపించుటకై ఆలోచించుచున్నట్లు తెలుపబడినది. సంవత్సరము ౧కి ౫ టన్నుల కాగితము తయారుచేయగల ఒకయంత్రమునకై లా ౫౦ లక్షలు ఖర్చు అగుననియు అంచనా వేయబడినది.

రాష్ట్రము లోపల మతసంబంధములైన ఆందోళన మొత్తముమీద లేదనుచు నివేదికలో నిట్లు చెప్పబడినది:—

ముఖ్యముగా తబ్లీగు ఉద్యమముయొక్కయు శుద్ధి ఉద్యమముయొక్కయు ఉత్సాహముచే కొన్ని చిన్నసంఘటనలు జరిగినను, మొత్తముపై కలహకర సంబంధములు అసంతృప్తికరముగ లేవు. కాని పైచెప్పిన ఉద్యమములు ప్రభుత్వమువారికి అందోళన కలిగించుచున్నవి.”

“విద్యావిషయములో “వర్ణభేదమునకు సంబంధించిన నిర్బంధములన్నియు ప్రభుత్వ పాఠశాలలలో తొలగించబడినవి. ఈతరగతులుగ్యల బళ్లు ౯,౦౦ కంటె ఎక్కువ ప్రభుత్వముచే నిరవహించబడుచున్నవి.”

## దోపిడిదొంగలతో బ్రిటిషువారిబేరము

ఇటలీతో బ్రిటిషువారి సమాధాన ప్రయత్నములనుగూర్చి ఆక్షేపణలు

లండను: ఫిబ్రవరి ౨౨

కామన్సుసభలోని లేబరు పక్షమువారు మంత్రులపైపెట్టిన విశ్వాసరాహిత్య తీర్మానము ఓడిపోయినది. ౧౬౮ మంది తీర్మానమునకు అనుకూలముగను ౩౩౦ మంది ప్రతికూలముగను ఓటు చేసిరి.

ప్రభుత్వపక్షమున వ్యవసాయశాఖ మంత్రి అగు మారిసన్ గారు వాదించుచు “తక్కిన మంత్రులందరు చేరి ఈడెను గారిని మంత్రివర్గమునుండి తొలగించుటకు ప్రయత్నించిరను వదంతులు కట్టుకథలు” అనిరి.

విశ్వాసరాహిత్య తీర్మానము ప్రతిపాదించిన గ్రీన్ వుడ్ గారు జాతిసమితి సూత్రములచే బ్రిటిషు విదేశ విధానమునను ముఖ్యసూత్రములుగ నుంచెదమని ౧౯౩౫ లో ప్రస్తుత మంత్రివర్గము తమ ఎన్నికల ప్రోగ్రాములో తెలిపిరి. ఇప్పుడు వారు చేయుచున్నదేమి!

ఆ ప్రోగ్రామును చల్లగా బుట్టలోవేసిరి.

అన్నిటిని విశాలమగు అంతర్జాతీయ దృష్టితో పరికించి పనిచేయుటకు బదులు మనప్రధానిగారు దారిదోపిడి దొంగల గూడెములోనికి పోయి వారితో బేరములాడుచున్నారు.

మన ప్రధానిగారు ఇప్పుడు అవలంబించుచున్న విధానము నిరంకుశ నియంతల విజయచిహ్నము. ఇటలీ బ్రిటిషు దేశమునుండి అప్పు తీసుకొనుటకు ప్రయత్నించుచున్నది. ఈ విషయములో తాము ఇటలీకి సహాయముచేయము అని ప్రభుత్వమువారు వాగ్దానము చేయవలెను.

ప్రభుత్వమువారి సహాయము లేనిదే ఇటలీకి ఇంగ్లండులో ఒకదమ్మిడీ అయినను దొరకదు. అప్పుతీసుకొను ప్రయత్నములో ఇటలీ గెలుపొందిన యెడల ఈ అప్పుతో నియంత ప్రభుత్వములు మరికొంత బలపడి ప్రజాప్రభుత్వములు మరికొంత తీవ్రముగ ఎదుర్కొనును.

ఇటలీ ఈ ధనమును ఈ పైకార్యమునకు తప్ప మరిదేనికిని వినియోగించదను మాట నమ్మవద్దు ” అనిచెప్పిరి.

### ప్రతిఘటన

విన్ స్టన్ చర్చిల్ గారు ప్రధాని అవలంబించిన విధానమును విమర్శించిరి.

పైకి ఎంత గాంభీర్యముగా కనబడుచున్నను ఇటలీ లోపలి వ్యవహారములు చిక్కుగ నున్నవని తెలియుట మంచిది. ముసోలినీకి తన దేశములో కొంత క్లిష్టత కలిగినది

కావున మ్యూనిచ్ గారికి ఇతరులసాయము అవసరమయినది. అట్టి సమయములో బ్రిటిషువారము మనమెందుకు సాగిలబడి ఆ సాయము చేయవలెనో నాకు బోధపడలేదు. ఎవరికేని తొందర మన బ్రిటిషువారికే ఎందుకుపుట్టవలెను?”

చర్చిలు బదులు చెప్పుచు ప్రధాని ఛేంబర్లేను ఇట్లు చెప్పెను.

“ఇప్పుడున్న ప్రశ్న అంతయు ఒక్కటే ఇటలీతో సంభాషణలు జరుపుటయా మానుటయా!

అపని ఎంతవేగముగ చేసిన మనకు అంత మంచిది.

### మహాప్రశ్న

ఈదేశమును యుద్ధరంగమునకు త్రోయుదురా అను మహాప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చు బాధ్యత నాపై పడకుండ నుండునుగాక, యనియే నేను ప్రార్థించుచున్నాను.

### మరొక బాధ్యత

ఇంకొక బాధ్యత కలదు. అదితప్పుటెట్లు! ఒక అధికారికలదు. అతడు అనవసరయుద్ధమున కిష్టపడడు. శాంతిని కాంక్షించువాడు, పరియగు సమయమున ఉచితమగు కార్యక్రమము పూనకుండిన ఆయుద్ధమే తప్పక కలుగును. ఆ కార్యక్రమము అవలంబించినచో ఈ ఘోరసంఘటన తప్పునని అతడు సంపూర్ణముగ విశ్వసించును. అట్టి అధికారికి గలబాధ్యత అల్పమయినదా! కాదు.

కాబట్టి, ఇప్పుడు నేను అవలంభించిన కార్యక్రమమును పూనకపోయినచో, నావిధిని నేను నిర్వర్తించనివాడ నగుదును.

అని బ్రిటిషు ప్రధానామాత్యుడు నెవిల్ ఛేంబర్లేను గారు తమ ఉపన్యాసమును ముగించిరి.

## తుంగభద్రా ప్రాజక్టు కగు ఖర్చు

న్యూఢిల్లీ ఫిబ్రవరి ౨౫

నేడు భారతదేశ కేంద్రశాసనసభయొక్క అసెంబ్లీలో ప్రొఫెసర్ రంగాగారు తుంగభద్రా ప్రాజక్టుయొక్క ఖర్చు ఎంతఅగునో అడిగిరి. అందుకు ఏ. జి. క్లోగారు సమాధానమిచ్చుచు మూల నిర్మాణమునకై రూ ౩½ కోట్లు అగునని అంచనా వేయబడినదనియు, దానిని మదరాసు హైదరాబాదు ప్రభుత్వములు సమానముగా పంచుకొనవలెననియు చెప్పిరి బ్రిటిషిండియాలో కాలువలకై రూ ౧౨ కోట్లగునని యు, దానిని మదరాసు ప్రభుత్వమువారే భరించవలసియుండుననియు చెప్పిరి.

ఇదేవిషయమున చిల్లర ప్రశ్నలకు కొన్నిటికి సమాధానమిచ్చుచు క్లోగారు ఈ ప్రాజెక్టుతో సంబంధముగల ప్రభుత్వముల మధ్య ఆలోచనలు సాగుచున్నవనియు, ఎపుడు ముగియునో చెప్పజాలమనియు చెప్పిరి.

# కడపటివార్తలు

## బీహారులో కూడ కాంగ్రెసు విజయము

కాంగ్రెసు మంత్రివర్గమువారు అధికారము చేపట్టుట

పాట్నా: ఫిబ్రవరి ౨౬

బీహారు గవర్నరుకును కాంగ్రెసు మంత్రివర్గ ప్రధాని శ్రీ కృష్ణసింహాగారికిని రాజకీయ ఖైదీల విడుదల విషయములో ప్రయాగరాష్ట్రములోవలెనే సమాధానముకుదిరినది.

కాంగ్రెసు మంత్రివర్గమువారు రాజీనామాల నుపసంహరించుకొని మంత్రి పనులను తిరిగి స్వీకరించినారు.

